విజయదశమి 1985

యుగాబ్ది

ప్రచురణ :

Acc. No. 8749

నవభారతి ప్రచురణలు

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాద్ - 500 029

ప్రతులకు :

సాహిత్య నికేతన్

3-4-852, బరకత్‌పుర

హైదరాబాద్ - 500 027

294.5
SAH

సాహిత్య నికేతన్

ఏలూరు రోడ్డు

విజయవాడ - 520 002

వెల : రు. 1-50 పై

ముద్రణ :

భారత ముద్రణాలయం

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాద్ - 500 029

384/85 — Acc. No. 874

# నివేదన

సనాతన ధర్మ శంఖారావంతో ప్రపంచం అంతటినీ ఉత్తేజపరచి, ఆధునిక భారతాన్ని ఆధ్యాత్మిక భావనాతరంగాలతో ముంచెత్తిన హైందవ తేజోరాశి, నవయుగ వైతాళికుడు స్వామి వివేకానంద. 39 సంవత్సరాల స్వల్పజీవితంలో ఆయన అందించిన దివ్యసందేశం జాతి తరతరాలు పదిల పరచుకోదగిన అమూల్య నిక్షేపం.

అంతర్జాతీయ యువజన సంవత్సరం సందర్భంగా ఆ తరుణ తపసి అమృతవాణిని వివిధ శీర్షికల క్రింద కూర్చి యువతరానికి వినిపిస్తున్నాం. స్ఫూర్తిప్రదమైన ఈ బోధనల నుండి ప్రేరణ పొందవలసినదిగా వారిని ఆహ్వానిస్తున్నాం.

వివేకానంద శతజయంతి ఉత్సవాల సందర్భంగా జాగృతిప్రచురణ సంస్థవారు ప్రచురించిన "వివేకవాణి" గ్రంథంలో తగు మార్పులు చేర్పులు చేసి ఈ సంకలనాన్ని రూపొందించాం. అందుకు అనుమతించినందుకు ఆ సంస్థకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

—ప్రకాశకులు

# వి ష య సూ చి క



ముఖచిత్రం, చివరిపేజి

వివేకానందకేంద్ర, మద్రాసువారి సౌజన్యంతో.

# ఇది మన మాతృభూమి

ధన్యమైన పుణ్యభూమి అనిపించుకొనే అర్హత ఏ భూమికైనా ఉంటే; కర్మానుభవానికి ఈ ప్రపంచమందలి ఆత్మలు అవతరించవలసిన భూమి అంటూ ఏదైనా ఉంటే; పరమాత్మను చేరడానికై వెళుతున్న ప్రతి ఆత్మకు చి చివరి మజిలీయైన భూమి అనేది ఒకటి ఉంటే; మహోన్నత మైన సౌజన్యం, ఉదారత, పావనత, ప్రశాంతత- అన్నింటికీ మించి ఆధ్యాత్మికత, అంతర్వీక్షణాలను మానవాళికి అందించిన మహత్తరమైన భూమి అనేది ఈ విశ్వంలో ఒకటి ఉంటే— అది భారతభూమి అని గుర్తించండి.

ఈ ధన్యభూమిలోని పర్వతశిఖరాలలో, గుహాంతరాళాలలో, ప్రచండ ప్రవాహపు తీరములలో అత్యద్భుతములైన ఆలోచనలెన్నెన్నో ఉద్భ వించాయి. వాటిని లేశమాత్రంగా గ్రహించిన పాశ్చాత్యులను సైతము అవి ఆశ్చర్యపరచాయి; అనితరము లనిపించుకున్నాయి.

అన్యదేశాలకు చేరేముందు విజ్ఞానం వికసించినది ఈ ప్రాచీన భూమిలోనే. ఆధ్యాత్మిక జ్ఞానవాహినులను ప్రదర్శిస్తున్నవా యన్నట్లున్న మహా నదీనదాలు, ఒక దానితో ఒకటి పోటీ పడుతూ స్వర్గరహస్యముల భేదించుట కా యన్నట్లు మహోన్నతంగా నిలచియున్న ఆ చిరంతన హిమ వన్నగ శిఖరాలు ఉన్నదీ భారతదేశంలోనే. ఈ భూతలమందు అవత రించిన పరమోత్తములైన ఋషిపుంగవుల పాదధూళిచే పునీతమైన భూమి ఈ భారతదేశం. మానవప్రకృతికి, ఆంతరిక విశ్వానికి సంబంధించిన పరి శోధన లారంభమైనదిక్కడే.

మతధర్మాలు ఆచరణయోగ్యంగాను, వాస్తవికంగాను రూపొందిన దీదేశంలోనే. అన్యదేశములలోని స్త్రీ పురుషులు తమ సోదరులైన దీన జనులను దోపిడీ చేసి స్వీయసుఖాలను పొందేందుకు ఎంత వెర్రిగా ఉద్రూత లూగుతారో, అంత తీవ్రంగాను జీవనలక్ష్యాన్ని చేరేందుకు ధైర్యంగా ముందుకురికే స్త్రీ పురుష సమాజము కల్గిన దేశమిదే.

ఇచ్చటే- ఇచ్చోట మాత్రమే మానవ హృదయం వికసించి ఒక్క మానవునే కాక, పశు, పక్షి, వృక్ష సంతతులను, మహోత్తమ దైవముల నుండి ఇసుక రేణువుల వరకూ, ఉన్నతునీ, అల్పునీ తనలో ఇముడ్చుకొని విస్తరిల్లి, అనంతమై విరాజిల్లినది. సృష్టిని అఖండ సమిష్టితత్వంగా— సృ స్పందనే స్వీయస్పందనగా మానవాత్మ పరిగణించిన దిచ్చటే.

మన మాతృభూమికి ప్రపంచం అనంతంగా ఋణపడి ఉంది. మన నిరంతర జాతీయాభ్యుదయ తరంగాలు, మహోన్నత సత్యముల బీజములు పూర్వమూ, నేడూ ప్రపంచంలో వెదజల్లబడియున్నవి.

అంతకు పూర్వము — నాటి నుండి నేటి వరకు ఈ దేశము నుండి భావనా పరంపరలు బయటకు ప్రవహించాయి. అందలి ప్రతి మాటకు వెనుకనున్న దొక శుభాకాంక్ష; ముందున్నది శాంతి లక్ష్యం. ప్రపంచ జాతులలో దురాక్రమణ జాతికానిది మన జాతి ఒక్కటే. ఆ సౌభాగ్యం మనది. క్షణికమైన మహాపరాక్రమాని, సార్వభౌమశక్తినీ కలిగి, క్రూరాతి క్రూరంగా జీవించి క్షణంలో టి బుడగలవలె నశించిన మహా జాతులు లేకపోలేదు. కాని వందలాది విదేశీ దండయాత్రలను, శతాబ్దముల ఆఘాతములను తట్టుకొని నిల్చిన దీ భారతభూమియే. ప్రపంచంలోని మహాశైలములన్నింటిని మించిన స్థయిర్యం తో, చెక్కుచెదరని స్వత్వముతో, అనశ్వరమైన చైతన్యంతో నిలిచియున్న దేశమే. ఆద్యంతరహితమైన నిత్యాత్మ ఎట్టిదో అట్టిదే ఈ దేశపు జీవితం. మనం అట్టి మాతృదేవి కన్న బిడ్డలం.

# హిందువు అంటే...

ఇది గుర్తించండి....

హిందూ అనే శబ్దాన్ని వినడంతోనే నీలో విద్యుత్తుల్యమగు మహత్తర శక్తిభావం కలిగితేనే నీవు నిజమైన హైందవుడవు;

ఏ దేశానికి చెందినవాడైనా, ఏ భాషకు చెందినవాడైనా 'హిందువు అనగానే అతడు నీకు ఆప్తుడు, ప్రేమపాత్రుడుఅయినప్పుడే నీవు నిజమైన హైందవుడవు;

హిందువుడనే పేరు గల ఎవరు కష్టాలలో ఉన్నా నీ స్వంత కుమారుడే అలా ఉన్నట్లు నీ హృదయం వ్యధ చెందినప్పుడే నీవు నిజమైన హైందవుడవు;

గురు గోవిందసింహుని వలె హిందువుల కోసం సమస్త బాధ్యతను స్వీకరించగల్గినపుడే నీవు నిజమైన హైందవుడవు.

హిందూ ధర్మరక్షణ కోసం తన రక్తాన్ని ధారవోసి, రణరంగంలో తన కన్నబిడ్డల సైతం కోల్పోయిన ఆ మహాకేసరి– తన సర్వస్వాన్ని ఏ హిందూ సమాజానికై ఒడ్డాడో, ఆ కృతఘ్న హిందూ సమాజం చేతనే త్యజింపబడినపుడు నిశ్శబ్దంగా రంగం నుండి విరమించి, దక్షిణ భారతంలో తనువు చాలించాడేగాని– ఆతని నోటి నుండి పల్లెత్తు పరుషవాక్యం రాలేదు!

ఇది మరువకండి!

మీ దేశానికి మీ వల్ల ఏదైనా ఉపకారం జరగాలంటే; మీలో ప్రతి ఒకరు ఆ గురు గోవిందసింహుని వలె కావాలి. మీ దేశీయులలో వేలాది లోపాలుండవచ్చు. కాని వారి హిందూ రక్తాన్ని గుర్తించండి. వారు మీ హృదయాలను గాయపరచినా సరే, వారిలోని ప్రతి యొకరు మిమ్ము నిందించినా సరే– వారే మీ మొదటి ఆరాధ్య దైవాలని మరువకండి; ఆత్మీయంగానే వారితో వ్యవహరించండి. వారు మిమ్ము గెంటివేస్తే

ఆ మహాకేసరి గురుగోవిందునివలె నిశ్శబ్దంగా నిష్క్రమించండి. అట్టివారె హిందూ అనే పేరుకు అర్హులు. ఆ ఆదర్శమే సదా మన ముందుండాలి. సంకుచిత భావాలను పాతిపెట్టి సర్వత్రా అనంత ప్రేమను వ్యాపింప జేయాలి.

* * * *

హిందూ అనే పేరు వైభవోపేతములు, ఆధ్యాత్మికములైన మహోన్నత సుగుణములకు నిదర్శనంగా నిలబడుతుందా లేక వెనుకబడిన, విలువ లేని, పనికిమాలినవారిని దూషించే ఒక తిట్టుగానే ఉపయోగింపబడుతూ ఉంటుందా అనేది మనమీదనే ఆధారపడి ఉంది. ఈనాడు హిందూ అనే పదానికి చెడు అర్థం ఏదైనా ఆపాదింపబడి ఉన్నా, ఫరవాలేదు. ఏ భాషలోనైనాసరే లభ్యమయ్యే పరమోత్తమమైన శబ్దం యిదేనని మన ఆచరణం ద్వారా ఋజువు చేయడానికి సిద్ధం కండి!

## ధర్మం మన ఊపిరి

ఆర్యజాతితోపాటే ఆవిర్భవించి, ప్రాచీన భారతీయ కవిఋష్యాదులచే గానము చేయబడి, దేశకాలముల కతీతమై నిలచియున్న సర్వశక్తిమంతమగు హేతువాదము మన సమాజమునకు పునాదిరాయియై, ఈనాటికీ హైందవ జీవన ప్రణాళికయై విరాజిల్లుతున్నది. ప్రారంభంలో జాతితోఉదయించిన జిజ్ఞాస అతిశీఘ్రగతిని నిర్భీకమైన పరిశీలనగా రూపొందింది.

* * * *

ప్రతి మనిషికీ ఒక వ్యక్తిత్వం ఉన్నట్లే, ప్రతి జాతికీ ఒక వ్యక్తిత్వం ఉంటుంది. కొన్ని విషయాలలో కొన్ని గుణాలలో ఒక మానవుడు మరో మానవునికి భిన్నంగా ఉండేట్లే, ఒక జాతి మరో జాతికి కొన్ని ప్రత్యేక లక్షణాల వలన భిన్నంగా కనిపిస్తుంది. సృష్టిస్వభావంలో ఒక్కొక్కమనిషి ఒక్కొక్క కార్యం సాధించడానికి జన్మించునట్లే పూర్వకర్మలనుబట్టి ఒక నిశ్చిత జీవన ప్రణాళికను పొందునట్లే, ప్రతి జాతి

ఒక లక్ష్యముంటుంది; తాను వెలువరించవలసిన ఒక సందేశమూ ఉంటుంది. కనుక మన జాతి కర్తవ్యం మొ మొదటే గ్రహించాలి. మన బాధ త గుర్తించాలి. మన లక్ష్యాన్ని లుసుకోవాలి. విభిన్న జాతుల పు గ మనంలో మన పాత్రను అర్థం చేసుకోవాలి. వివిధ జాతుల స్వరమేళ నంలో మన మాలాపించవలసిన రాగాన్ని ఆకళించుకోవాలి.

ప్రతి జాతి యొక్క జీవనానికి ఒక కేంద్ర బిందువుంటుంది. దాని చుట్టూ జాతీయజీవనం విలసిల్లుతుంది. అది ఆ జాతికి ఆయువుపట్టు. అది దెబ్బ తిననంతవరకూ జాతి నశించదు.

రాజకీయ, సాంఘిక స్వేచ్ఛలు మంచివే. కాని వాస్తవమైనది ఆధ్యాత్మిక స్వేచ్ఛ– ముక్తి– ఇదీ హైందవ భావన. ఇదీ మన జాతీయ సంకల్పం. వైదికుడైనా, జైనుడైనా, బౌద్ధుడైనా, అద్వైతియైనా, విశిష్టాద్వైతిఐనా, ద్వైతిఐనా– ఈ విషయంలో అందరి భావన ఒకటే.

మన శక్తి, మన బలము– అంతే కాదు, మన జాతీయ జీవనమే ధర్మాన్ని ఆశ్రయించి ఉన్నది. అలాగే శాశ్వతంగా ఉంటుంది. నాకున్నంత విశ్వాసం మన ధర్మంమీద మీకు లేకపోయినా, దాన్ని ఆశ్రయించే మీరు నిల్చొనకతప్పదు. మీరు ధర్మబగాలు. దాన్ని త్యజిస్తే ఛిన్నాభిన్నులై నశిస్తారు. అది మన జాతి జీవ ం. దాన్ని మనం బలపరచుకోవాలి. అది మన జాతీయమేధ. అది మన జాతీయజీవన చైతన స్రవంతి. దాన్ని అనుసరిస్తే పరమ వైభవాన్ని ఆర్జిస్తాం; త్యజి నశిస్తాం. ఈ జీవన స్రవంతిని విడచిన మరుక్షణంలో మృత్యువే గతి. శూన్యమే మిగిలేది.

రాష్ట్రాత్మ ఎక్కడ ఉన్నదీ ఇప్పుడు తెలిసింది– అది ధర్మంలో ఉన్నది. దానిని ఎవ్వరూ విధ్వంసమొనరించజాలనందుననే హిందూరాష్ట్రం ఇన్ని ఆఘాతాలను తట్టుకొని ఇంకా సజీవంగా నిలచి ఉన్నది.

ప్రతి జాతికీ ఒక ప్రత్యేక కార్యపద్ధతి ఉంటుంది. మన గమనానికి ధర్మమే మా ము. హైందవుడు రాజకీయాలను సైతం ధ ర్మం ద్వారా

నై తేనే గ్రహించగలడు. ప్రతిదీ ధర్మం ద్వారా నే రావాలి. అది మూల ధార– మిగతావన్నీ జాతీయ చైతన్య సంగీతంలోని వైవిధ్యాలే.

మంచికో చెడుకో— వేలయేండ్లుగా హిందూ దేశంలో ధార్మికత ఆదర్శమై నిలచింది. హిందూ దేశ వాతావరణం ధార్మిక ఆదర్శాలతో నిండి ఉంది. ధార్మిక భావన మన రక్తంలో ప్రవేశించి, మన రక్తనాళాల లోని ప్రతి బిందువుతోనూ మిళితమై, మన స్వభావంలో భాగమై, మన జీవితానికి జవమై, జీవమై అలరారుతున్నంతగా– ఈ ధార్మికభావనల మధ్య మనం పుట్టి పెరుగుతున్నాం. గంగానదీ ప్రవాహం వెనుకకు మళ్ళింపబడ వచ్చునేమోగాని, ఈ దేశానికి లక్షణమైన ధార్మిక జీవన పథాన్ని విడచిపెట్టి రాజకీయమో, మరొకటో క్రొత్త దారి త్రొక్కటం మాత్రం అసాధ్యం. ధార్మికపథమే హిందూదేశానికి సులభమైన మా ం. మనుగడకు,అభివృ కి జన సంక్షేమ సాధనకు ఇదే సరియైన మార్గం.

మనం ఆధ్యాత్మికతను అనుసరించకుండా హిందూదేశ పునరుజ్జీవనం అసంభవం. అంతమాత్రమే కాదు. యావత్ప్రపంచపు శ్రేయస్సు కూడా మనపైనే ఆధారపడియుంది. భౌతిక సుఖములు, తదితరములైన ఇసుక పునాదులపై ఆధారపడిన నాగరికతలన్నీ కూడా స్వల్పకాలికమైన మను గడతోనే ఈ ధరాతలం నుండి ఒక దాని వెంట ఒకటి తుడిచి పెట్టుకొని పోయాయి. కాని హిందూ నాగరికత, హిందూ దేశపు చరణముల మ్రోల నిలచి పాఠములు నేర్చుకొనిన జపాను, చైనా దేశముల నాగరికతలు, నేటికీ నిలచియున్నవి; పునరు వితమగు సూచనలు కన్పించుచున్నవి. వేయి సార్లు ధ్వంసమొనర్చబడి నూ మరల మరల ఇతోధిక వైభవముతో లేచి నిలబడుటకు వాటి జీవితములు సిద్ధముగా నున్నవి. కాని భౌతికవాద నాగరికతలు ఒకసారి విధ్వంసమయ్యెనా, మరల తలెత్తుటయే లేదు. కావున మిత్రులారా! ఓరిమి వహించి మన పూర్వజులైన మహాపురుషులు మనకు బహూకరించిన ఆ ఆధ్యాత్మికతకు గ గా అంటిపెట్టుకొని ఉండాలి. అది మన మొదటి కర్తవ్యం.

ప్రపంచంలో సమాజ జీవన నిర్మాణానికి రెండు రకాల ప్రయత్నాలు జరిగాయి. ఒకటి ధర్మము నాశ్రయించినట్టిది. రెండవది సాంఘికావసరముల నాశ్రయించినట్టిది. ఒకవైపు స్వార్థాన్నే ఆశ్రయించిన పశ్చిమ సమాజాల స్వేచ్ఛాప్రవృత్తి; మరో వైపు భారత సమాజపు సంపూర్ణస్వార్థ త్యాగము. పాశ్చాత్యుల లక్ష్యం వ్యక్తి స్వేచ్ఛ. ధనార్జన కోసం అభ్యసించే విద్యయే వారికి భాష; సాధనం రాజకీయాలు. భారత దేశానికి లక్ష్యం ముక్తి. భాష వేదం; సాధనం త్యాగం.

ఒకవైపు ఆధునిక భారతం "మీరు పశ్చిమ భావాలను, ఆహార వ్యవహార వేషభాషాదుల నాశ్రయిస్తేనే వారిలో తులతూగే శక్తిసామర్థ్యాలు పొందగలరు" అని ఉద్ఘాటిస్తున్నది. మరొకవైపున ఆర్ష భారతం "మూఢులారా! అనుకరణవల్ల విదేశీ భావాలు మన స్వంత భావాలు కాజాలవు. నీ స్వశక్త్యార్జితాలు అయితేనేగాని ఏవీ స్వంతం కావు" అని ఉద్బోధిస్తున్నది.

మనస్వభావాన్ని అనుసరించే మనం వికసించాలి. మనలను మలచి, హింసించి ఇతర జాతుల రూపంలో పోత పోసేందుకు వీలు లేదు. అన్యజాతుల వ్యవస్థలను నేను ఖండించను. వారి కవి మంచివే. మనకు మాత్రం పనికిరావు.

నూతన పరిస్థితులు భారతదేశ సాంఘిక వ్యవస్థలలో క్రొత్త మార్పులు కోరుతున్నాయి. గడచిన 75 ఏండ్లలోను భారతదేశం సంస్కరణ సంఘాలతో, సంస్కర్తలతో నిండిపోతూన్నది. కాని ప్రతి ఒక్కరూ విఫలురే ఐనారు. దీనికి కారణం వారికి కీలకం తెలియకపోవటమే. తొందరపాటుతో, మన సమాజంలోని దోషాలన్నింటినీ మన ధర్మానికి అంటగట్టారు. పర్యవసానంగా, అదేదో కథలోచెప్పినట్లు, మిత్రుని ముఖం మీద వ్రాలిన దోమను చంపే సదుద్దేశంతో అతడి ప్రాణానికే మోసం తెచ్చినట్లయింది.

జాతి కుటీరముల యందున్నది. కాని అచటి ప్రజల శ్రేయస్సుకు ఎవరూ, ఏనాడూ ఎట్టి కృషి చేయలేదు. మన ఆధునిక సంస్కరణాభి

ప్రాసులకు విరంటి వివాహములతో తీరుబడి లేకుండా ఉంది. నేను సంస్కరణలకు వ్యతిరేకిని కాను. కాని జాతి యొక్క వైభవము వితంతువులకు ఎందరకు భర్తలు లభిస్తారనే దానిమీద కాక— జన సామాన్యపు పరిస్థితిపై ఆధారపడి ఉంటుంది. వారిని మీరుద్ధరించగలరా? వారి ఆంతరిక ఆధ్యాత్మిక ప్రవృత్తికి అఘాతం కలుగకుండా మీరు వారు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి ప్రసాదించగలరా కృషి, శక్తి, స్వేచ్ఛ, సమానత్వాది విషయాలలో పాశ్చాత్యులలోకెల్ల పాశ్చాత్యుడవై ధార్మిక, సాంస్కృతికవిషయాలలో అణువణువునా హైందవుడవుగా భాసించగలవా? ఇది జరిగితీరాలి. చారిత్రకంగా సంక్రమించిన మన జాతి లక్షణాన్ని నిలుపు కోవాలి.

ఇతర దేశాల సమస్యల కంటే భారతదేశ సమస్యలు జటిలమైనవి, తీవ్రమైనవి. జాతి, ధర్మం, భాష, ప్రభుత్వం— ఇవన్నీ కలిస్తేనే రాష్ట్ర మవుతుంది. మన అందరికీ సమాన భూమిక యీ మన పవిత్ర ధర్మం, సంప్రదాయం. యూరోపులో రాజకీయ భావాలు జాతీయ సమైక్యతకు ఆధారభూతమైనాయి. భారత భవిష్యత్తుకై నేడు ధర్మసమైక్యత ప్రథమావసరం. మన యీ మహాదేశము ఏకధర్మబద్ధమై ఉండాలి.

మన ధర్మంలో స్వసంప్రదాయాలకు ఆమోదయోగ్యములైన కొన్ని సూత్రాలున్నాయి. మనం ద్వైతులమైనా, అద్వైతులమైనా, విశిష్టాద్వైతులమైనా, శైవులమైనా, వైష్ణవులమైనా, పాశుపతులమైనా— సంప్రదాయాన్ని అనుసరించినా, మనకు కొన్ని సమాన ధర్మాలున్నవనీ, మన యావన్మంది క్షేమానికీ, మన జాతి మనుగడకూ, పరస్పరం అల్పాల్పములైన విభేదాలను విస్మరించాలనీ, పరస్పర కలహాలను మానాలనీ ప్రతి హిందువుకు బోధింపబడాలి. ఇదే ప్రథమ కర్తవ్యం.

చెల్లాచెదురుగ పడివున్న ఆధ్యాత్మిక శక్తుల కలయికతో భారత దేశంలో జాతీయ సమైక్యత ఏర్పడాలి. భారతజాతి అంటే కేవలం ఒకే ఒక్క ఆధ్యాత్మిక సంగీతానికి లయబద్ధమైయున్న హృదయాల సంఘటనే.

# క్షాత్రగీతం

"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!"
గీతాబోధన అసలు ప్రారంభమయ్యేది ఈ విశిష్ట శ్లోకంతో.

"అర్జునా! హృదయ దౌర్బల్యాన్ని త్యజించి లే; లేచి పోరాడు" అన్నాడు కృష్ణభగవానుడు. అప్పుడు అర్జునుడు శ్రీ కృష్ణునితో వాదించేందుకు ఉ ఓ నైతిక భావాలను ప్రతిపాదిస్తాడు. ఎదిరించటం కంటే విరమించుకోవటం ఎలా ఉత్తమమైనదో వివరిస్తాడు. అలా తన అకర్మణ్యతను సమర్ధించుకోవడానికి ప్రయత్నిస్తాడు. కాని శ్రీ కృష్ణుని మోసగించడం సాధ్యమా? శ్రీ కృష్ణుడు మహోన్నతాత్ముడు- సాక్షాత్తూ పరమేశ్వరుడు. ఆ వాదన ఆంతర్యాన్ని ఇట్టే గుర్తిస్తాడు. అర్జునుని వాదనలోని ఆంతర్యం కేవలం దౌర్బల్యమే.

* * * *

శ్రీ కృష్ణుడు యుద్ధాన్ని ఆపేందుకు ఎంతో ప్రయత్నించాడు. కాని యుద్ధాన్ని తెచ్చిపెట్టింది ఆ దుర్యోధనుడు. అయితే ఒకసారి దిగిన తరువాత వెనుకంజకూడదు. అదీ కర్తవ్యమూర్తి లక్షణం. పారిపోవడం తగదు; అది పిరికితనం. దిగిన తరువాత సాధించాలి; ఒక్క అంగుళమైనా చలించ తగదు. అన్యాయానికై కాదీ యుద్ధం, ఇది ధర్మయు ం.

ఉన్నదెప్పుడూ (సత్) లేకుండా పోదు. లేనిది (అసత్) ఎప్పుడూ ఉండబోదు. కనుక ఈ సృష్టి సర్వత్రా వ్యాపించిన తత్వం ఆద్యంతములు లేనిది. దానికి చావు లేదు. సృష్టిలో ఏదీ నశించదు. ఈ శరీరానికి చావు పుట్టుకలున్నా, ఈ శరీరంలో నివసించేవాడు అనంతుడు. ఇది తెలిసి లే; నిలబడి పోరాడు; ఒక్క అడుగు కూడా వెనక్కి వేయవద్దు. ఆకాశంనుండి నక్షత్రాలు రాలనీ! ప్రపంచమంతా ఏకమై ఎదురు నిలవనీ! ఏది వచ్చినా

ఎదిరించు. చావు అంటే దుస్తుల మార్పు మాత్రమే– అందులో ఏముంది? కాబట్టి పోరాడు. పిరికివాడివై నీవు సాధించేదేమీ లేదు. వెనుకంజ వేసి నీవు ఏ ప్రమాదాన్నీ తప్పించుకోలేవు. నీవు అనంతుడవు, అమరుడవు, అజాతుడవు. అనంత ఆత్మస్వరూపుడవైన నీకు దాసునిగా పడి ఉండటం తగదు. లే! నిలబడు! పోరాడు! అవసరమైతే ప్రాణా లర్పించు.

* * * *

ప్రపంచంలో పాపమనేది ఏదైనా ఉంటే అది ఒక్క భయమే. నిద్రాణ శక్తులను మేలుకొల్పే పనులు చేయటమే పుణ్యం. మనశ్శరీరాలను బలహీనం చేసే పనులే పాపం. కనుక ఈ దౌర్బల్యాన్ని, భీతిని గెంటి వేయి. నీవు వీరుడివి, నీకిది తగదు.

నాయనలారా! ఈ సందేశాన్ని మీరు ప్రపంచానికి చాటగలరా? అప్పుడే ఈ సమస్త విషాదము, పాపము, విచారము, మూడు రోజులలో మటుమాయమౌతాయి. దుర్బలభావాలు మచ్చుకైనా కన్పించవు. నేడు– ఈ భయము తరంగాలుగా సర్వత్రా సంచరిస్తున్నది. ఈ తరంగాన్ని త్రిప్పి కొట్టండి. దీనికి వ్యతిరేకమైన తరంగాన్ని సృష్టించండి. ఒకఅద్భుత మైన మార్పును దర్శించండి. మీరు సర్వశక్తిమంతులు. ఫిరంగుల ముఖం లోకి చొరబడటానికి కూడా భయపడకండి.

* * * *

ప్రస్తుత పరిస్థితులలో శ్రీ కృష్ణుని దివ్యక్రీడలు నీకు ఉపకరించవు. మురళిని ప్రయోగించినందున దేశం ఉద్ధరింపబడదు. అద్భుత క్షాత్రతేజం అపాదమస్తకము తొణికిసలాడే ఒక మహావీరుడు– సర్వో[illegible]షణకై తెగించి ప్రాణాలొడ్డగల ధీరుడు, త్యాగమే ధనుస్సుగా, విజ్ఞానమే కరవాలంగా కలిగిన వీరుడు– నేడు మనకు ఆదర్శమై నిలవాలి. నేడు కావలసింది జీవితాన్ని సుఖమయ ఉద్యానవాటికగా భావించే ప్రేమకలాపి కాదు; జీవన సంగ్రామ రంగంలో మహాయోధుడై నిలవగలిగిన వీరుని ఆదర్శం.

* * * *

నాయనలారా! కావలసింది ఇనుప కండలూ, ఉక్కు నరాలు. వజ్రకఠోరమైన మనస్సు, శక్తి, పౌరుషం, క్షాత్రవీర్యం— బ్రహ్మతేజం కావాలి.

*    *    *    *

ఈ దేశంలో ఢంకాలు తయారుకావటం లేదా? భేరీలు, శంఖాలు దొరకటం లేదా? మన బాలకులకు ఈ వాద్యముల ఉచ్ఛస్వర శబ్దాలను వినిపించండి. చిన్ననాటి నుండి కోమలమైన వాద్యసంగీతాన్నే వింటూ ఈ దేశం అబలల దేశంగా మారిపోతోంది.

*    *    *    *

నేడు రజోగుణమే మిక్కిలి అవసరం. సాత్వికులని మీరుభావించే వారిలో నూటికి తొంభై మంది గాఢమైన తమస్సులో మునిగియున్నారు. దేశం యావత్తూ గాఢ తమస్సుతో ఆవరింపబడియున్నది. నేడు అనంత రాజసశక్తి మనకు కావాలి. ఈ దేశవాసులకు అన్నవస్త్రాలు లభింప జేయాలి: వారిని మేల్కొల్పాలి. అనంత కార్యపరాయణులుగాచేయాలి. లేనిచో వారు చెట్లుచేమల్లా, గండశిలల్లా స్తబ్ధులై పోతారు.

*    *    *    *

వేదాంతము పాపము నామోదించదు. దోషాన్ని అంగీకరిస్తుంది. 'నేను బలహీనుణ్ణి, పాపిని, దురదృష్టవంతుణ్ణి, నాకు శక్తి లేదు, నేనేదీ చేయజాలను' అని భావించటమే మహాదోషమని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది.

*    *    *    *

బలమే జీవనము, బలహీనతే మరణం. బలమే సుఖం, శాశ్వత జీవనం, అమరత్వం. బలహీనత భరింపరానిది, క్లేశకరమైనది. ఈ క్లేశానికీ, మృత్యువుకూ, దుస్థితికీ భయమే కారణం.

*    *    *    *

విజయం సాధించాలంటే అమోఘమైన పరిశ్రమ, అచంచలమైన సంకల్పమూ మీలో ఉండాలి. నేను సముద్రాన్ని ఆపోశన పడ్తాను— నా

సంకల్పానికి కొండలైనా దార్లిపోతాయి' అంటుంది పరి మించేవ్యక్తిత్వం." అటువంటి శక్తినీ, సంకల్పాన్నీ కలిగించుకోండి; గట్టిగా కృషి చేయండి- అప్పుడే గమ్యాన్ని చేరుకుంటారు.

*　*　*　*

నీ పట్ల, పరమాత్మ పట్ల ముమ్మాటికీ విశ్వాసం కల్గియుండటమే విజయరహస్యం. ముప్పది మూడు కోట్ల పురాణ దేవతలప , వారితో పాటు అప్పుడప్పుడూ విదేశీయులు మన మధ్య చొప్పించిన వతలందరి పట్ల విశ్వాసం ఉంచికూడ నీ పట్ల నీకు విశ్వాసం లేనట్లయితే- నీకికముక్తి లేదు.

*　*　*　*

ధీరులైన వత్సలారా! మీరందరూ మహత్కార్యాలను సాధించ డానికి జన్మించామనే విశ్వాసం కలిగి ఉండండి. కుక్కపిల్లల అరుపులకు మీరు భయపడరాదు; అంతేకాదు, ఆకాశం నుండ విరిగిపడే పిడుగులకైనా మీరు చలించరాదు.

*　*　*　*

ఉపనిషత్తుల నుండి 'బాంబు'లాగా వెలువడి అజ్ఞానరాశులను ప్రేల్చి వేసె ఏకైక శబ్దమేదైనా ఉన్నదీ అంటే- అది 'నిర్భీకత' అనేదే.

*　*　*　*

నేను ఒకసారి కాశీలో ఒక వీధిలో వెళ్తున్నాను. ఒకవైపున పెగ చెరువు; మరో వైపున పె గోడ ఉన్నాయి. ఆ వీధిలో చాలా కో లున్నాయి. కాశీలో కోతులు చాలా భయంకరంగా ఉంటాయి. నన్ను ఆ వీధిలోంచి వెళ్ళనివ్వకూడదని అనుకున్నట్లున్నాయి. అవి నా మీదమీదకు వచ్చి అరవటమూ, కాళ్ళు పట్టి లాగటమూ మొదలుపె యి. వాటి ఆగడాలు ఎక్కువ కావటంతో, భరించలేక పరుగు మొదలు ట్టాను. నేను పరుగెత్తినకొద్దీ అవీ నా వెంట పరుగెత్తసాగాయి. ఇంక తపి ంచుకోవటం అసాధ్యమనే అన్పించింది. ఇంతలో ఒక అపరిచితుడు కేక సి చెప్పాడు.

'ఆ మృగాల్ని ఎదుర్కోండి'. నేను వెనక్కి తిరిగి వాటిని ఎదిరించాను. అంతే; అవి వెనక్కి తగ్గి పారిపోయాయి. జీవితానికంతటికీ సరిపోయిన పాఠం అది. బీభత్సాన్ని ఎదుర్కోండి— ధైర్యంతో ఎదుర్కోండి.

* * * *

ప్రతి కార్యమూ అవహేళన, ప్రతిఘటన, ఆమోదము అనే మూడు దశల గుండా పయనించవలసిందే. తన కాలాని కంటే ముందు చూపు కల్గిన వ్యక్తి సమకాలికులచే అపార్థం చేసుకోబడటం సహజమే. అందువల్ల వ్యతిరేకతనూ, కార్యాన్ని తుదము ంచే యత్నాలనూ ఆహ్వానించవల సిందే. భగవంతుని యందు అచం ల విశ్వాసంతో, నిబ్బరంగా, పవి త్రంగా ఉంటే, ఈ ఆటంకాలన్నీ మటుమాయమౌరాయి.

* * * *

ప్రతి ఒక్కరూ తన శక్తినంతటినీ ధారవోసి పాటుబడకుండా ఏ పనైనా సాధ్యపడుతుందా? 'ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః'– ఉద్యమించి ప ి చేస్తున్న పురుషసింహులనే లక్ష్మి వరిస్తుంది. వెనక్కి చూడకండి; ముందుకు ఉరకండి. అనంతమైన శక్తి, అనంత మైన ఉత్సాహం, అనంతమైన సాహసం, అనంతమైన ఓరిమి కావాలి మనకు. అప్పుడే మహత్తర విజయాలు సాధించగలము.

* * * *

సోదరులారా! మనం కష్టించి పని చేయాలి. ఇది నిద్రించవలసిన సమయం కాదు; మనపై భవిష్య భారతావతరణం ఆధారపడియున్నది. ఆ తల్లి మనకై నిరీక్షిస్తోంది. ఆమె ప్రస్తుతం నిద్రిస్తున్నది; అంతే. లేచి, మేల్కొని పునరు విత జీవనంతో, అపూర్వయశంతో విరాజిల్లేట్లు విజృంభించి మన మాతృదేవిని తన శాశ్వత సింహాసనంపై అధి ంప జేయండి.

* * * *

విద్యుక్త కర్మను దేనినీ నిరసించకూడదు. చేసే పనిని బట్టి కాక, ఆ పనిని చేసే విధానాన్ని బట్టి వ్యక్తులను పరిశీలించాలి. వృత్తిక్రమలబట్టి అతి కొద్దికాలంలో, అందమైన గట్టి చెప్పుల జోడు తయారుచేయగల చర్మకారుడు నిత్యజీవితంలో నిరర్థక ప్రసంగాలు చేసే ప్రాధ్యాపకునికంటే ఉత్తముడు. ప్రతి విద్యుక్త క్రియా పవిత్రమే. ఆ విద్యుక్త క్రియపై నిష్ఠ కలిగి ఉండటమే మహోత్తమ ఈశ్వరారాధనా పద్ధతి.

* * * *

వినయశీలాన్ని సాధించు. కాని స్వీయవిశ్వాసాన్ని త్యజించకు. పెద్దల పట్ల వినయం లేనిదే కేంద్రీకరణ సాధ్యం కాదు. వ్యక్తులశక్తులను కేంద్రీకరించనిదే ఏ మహత్కార్యమూ నెరవేరదు. మీలో ప్రతి ఒక్కరూ మహోన్నతుడవక తప్పదు. తప్పదని నేను ప్రకటిస్తున్నాను. వినయం సంసిద్ధత, ఆదర్శంపట్ల ప్రేమ— ఈ మూడూ ఉంటే, నిన్నాపగలిగే శక్తి లేదు.

* * * *

ఒక రాజు ఉండేవాడు పొరుగురాజు మరొకడు తన రాజధానిపై దాడికి వస్తున్నాడని విన్నాడు. దేశాన్ని శత్రువుల బారి నుండి రక్షించ డానికి సలహా సంప్రదింపుల కొరకు ఒక మహాసభను ఏర్పాటు చేసి ప్రజ లందరినీ ఆహ్వానించాడు. స్థపతులు వచ్చారు. చుట్టూ మట్టికోట, అగడ్తా నిర్మించాలని సలహా యిచ్చారు. వడ్రంగులు చెక్కతో దుర్గం నిర్మించ మన్నారు. చర్మకారులు తోలుగోడలు కట్టాలన్నారు. కమ్మరులు ఆ సలహాలన్నింటినీ కాదని ఇనుపకోటను కట్టాలన్నారు. ఆ తరువాత న్యాయ వాదులు వచ్చారు. వచ్చి, ఇది చట్టవిరుద్ధ చర్య అనీ, పరుల ఆస్తి కాజేయటం తగదని వాదించాలనీ అన్నారు. ఇంతలోకే పురోహితులువచ్చి, అందరినీ అపహసించి 'అన్నిటికంటే ముందు దైవతృప్తికి బలులివ్వాలి; అప్పుడే మనం అజేయులం కాగలం' అన్నారు.

అలా దేశాన్ని రక్షించుకోవటం మరచి, పరస్పరం వాదించు

కున్నారు, కలహించుకున్నారు. ఈలోగా శత్రువు రానేవచ్చాడు. రాజధానిని ఆక్రమించుకొని విధ్వంసం చేశాడు.

అవసరాన్ని గుర్తించకుండా అజ్ఞానంతోను, మూర్ఖంగాను తమ వాదాలను పట్టుకు వ్రేలాడే మానవుల స్థితి ఇంతే.

* * * *

సౌశీల్యము, బు , ఇతరులను సేవించడానికై సమస్తమూ త్యాగం చేయగల సంసి తా, వినయాదులతో ఈ నా భావాలను సాక్షాత్కరింపజేయు డానికి తమ స ్వస్వం సమర్పించగల యువకుల మీదే నా ఆశలు ఆధార పడి ఉన్నాయి. వారే తమకూ, దేశానికీ మేలు చేయగలరు. సాధారణ యువకులు ఎందరో లభించవచ్చు. కాని స్త తే వారి లలాటాల మీద —సి ఉంటోంది. వారి గుండెలలో శక్తి లే... నీరస శరీరులు, ధైర్య హీనులు: వీరుచేయగలకార్యం ఏమిటి? శక్తిమంతులు, ఉత్సాహవంతులు, ఆత్మ విశ్వాసపూర్ణులు, విశ్వాసపాత్రులూనైన యువజనులు కావాలి. అటు వంటివారు– నచికేతుని వంటివారు– ఒక వందమంది చాలు– ఈ దేశం యొక్క ఆశయసాధనలను నూతన దిశకు మార్చి ప్రవహింపజేయగలను.

## మేలుకో సోదరా! మేలుకో

ఓ భారతవర్షమా! నీ సతీత్వానికి ఆదర్శం సీత, సావిత్రి, దమ యంతి అనే మాట విస్మరించకు. నీవు ఆరాధించే దైవము సర్వసంగ పరి త్యాగి, యోగీశ్వరుడునైన ఉమామహేశ్వరుడు– శంకరుడనే మాట విస్మ రించకు. నీ వివాహము, ధనము, జీవనమూ, నీ విషయ సుఖాల కొరకూ వ్యక్తిగతమైన ఆనందం కొరకూ కాదు; నీవు మాతృవేదికపై సమర్పణగా అవతరించావనేమాట విస్మరించకు. అనంత జగన్మాతృత్వానికి నీ సమాజ విధానం ప్రతిబింబమనే మాట విస్మరించకు. నిమ్నులు, అమాయకులు, దరిద్రులూ, నిరక్షరులూ, చర్మకారులు, శుచికారులూ నీ ప్రాణాలకు

ప్రాణాలనీ, నీ సోదరులనీ విస్మరించకు. ఓ పరాక్రమశాలీ! ధీరుడవై యుండు. సాహసాన్ని పుంజుకో. హైందవుడవైనందుకు గర్వించు. "నేను హైందవుడను. ప్రతి హిందువూ నా సోదరు"డని సగర్వంగా ప్రకటించు. "ప్రతి అమాయక హైందవుడూ, అనాధ హైందవుడూ, బ్రాహ్మణుడు, చండాలుడూ అంతా నా సహోదరులే" అని ఉద్ఘాటించు.

వస్త్రధారీ! కటిమాత్ర పరిధానుడా! నీవు కూడా "హైందవుడు నా సోదరుడు, హైందవుడే నా ప్రాణం, హైందవదైవతములే నాదైవతములు; హైందవ సమాజము నా శైశవ డోలిక; నా యౌవనానంద నందనం; వార్ధక్యంలో నా పునీతస్వర్గం– నావారణాసి" అని ఎలుగెత్తిచాటు. సోదరా! హిందూభూమియే నా సర్వోన్నత స్వర్గము, హిందూభూమి శ్రేయమే నా శ్రేయ"మని ప్రకటించు. "ఓ గౌరీ మహేశ్వరా! ఓ జగజ్జననీ! నాకు పౌరుషాన్ని ప్రసాదించు. ఓ సామర్థ్య ప్రదాయినీ! నా దౌర్బల్యాన్ని తొలగించు, నా పౌరుష హీనతను తొలగించు. నన్ను పూరుషుణ్ణిగా నిర్మించు" అని అహర్నిశలు ధ్యానించు.

* * * *

మనం హిందువులం. నా పితరులను చూచి నేను సిగ్గుపడను. నా మహాదాదర్శాలలో ఇదొకటి. సృష్టిలో నేటివరకు పుట్టినపరమాభిమానులలో నేనొకణ్ణి. అయితే అది నా ఘనత కాదు, నా పితరుల ఘనత, గతాన్ని గురించి చదివిన కొలదీ, గతంలోకి పారజూచినకొద్దీ నా యీ అభిమానం ద్విగుణీకృతమవుతూ వచ్చింది. దీనివలన నా విశ్వాసం బలవత్తరమై, సాహసోపేతమై నన్ను ధూళి నుండి లేపి. మహానుభావులైన మన పూర్వులు ప్రకటించిన జీవన ప్రణాళికను సాధించడానికిపురికొల్పింది.

* * * *

అనుకరణ నాగరికత కాదు. మనం గ్రహించవలసిన. మరో గొప్ప పాఠం ఇది. దుర్బలమైన అనుకరణ ప్రగతిని సాధించదు. మానవు అధఃపతనానికిది ప్రబల నిదర్శనం. విదేశీ భావాలు కొల్లలుగా మన

దేశాన్ని ఆక్రమించుకొని మన జీవనాడులను తినివేస్తున్నాయి. మనలో నూటికి తొంబది తొమ్మిది మందిమి విదేశీ భావాలు, అనుభూతులకు నిలయులమైనాము. ప్రపంచ జాతుల దృష్టిలో మనం ఉత్తమస్థితి నందాలంటే వీటిని దులిపివేయాలి. శరీరం బలహీనంగా ఉన్నపుడే రోగక్రిములు శరీరాన్ని నింపివేసి రోగాన్ని సృష్టిస్తాయి. రాష్ట్రాల విషయమూ ఇంతే. రాష్ట్రం బలహీనంగా ఉన్నపుడే రాజకీయాలలో, సమాజంలో, విద్యాబౌ క రంగాలలో వ్యాధికారకములైన అనేక క్రిములు ప్రవేశించి పలువ్యా . లు జన్మింపచేస్తాయి. దీనిని తొలగించడానికి వ్యాధిమూలాన్ని శోధించి, రక్తాన్ని సమస్త దోషముల నుండి క్షాళనం చేయాలి.

* * * *

ఇతరులలో ఉన్న మంచిని గ్రహించు. అయితే దానిని నీ పద్ధతిలో స్వంతం చేసుకో. అంతేగాని నీవే పరాయివాడవు కావద్దు. భారతీయులందరూ వేషభూషణలలోను, ఆహారవిహారాల్లోను వేరే ఏ జాతివారివలెనో వ్యవహరించటం ఉత్తమమని ఒక్క క్షణం కూడా తలపోయవద్దు. కొ సంవత్సరాల అలవాటును విడనాడటం ఎంత కష్టమో మీకు తెలుసు. మ సీ రక్తంలో ఎన్ని వేల సంవత్సరాల సంస్కారం ఇమిడి ఉందో ఆ పరమాత్మకే తెలియాలి. తన గమ్యస్థానం చేరబోతున్న విశాలమైన గంగాప్రవాహం వెనుదిరిగి హిమాలయాల మంచు శిఖరాలమీదకు చేరగలదని భావిస్తున్నావా? అది అసాధ్యం. అందుచేత జాతీయ జీవన స్రవంతిని ముందుకు సాగనీ! దారిలో ఉన్న అవరోధాలను తొలగించి, దారిని సుగమం చేయి. దాని సహజమైన ఉధృతితో అది ముందు కురుకుతుంది. జాతి పురోగమిస్తూ అభివృద్ధి చెందుతుంది.

* * * *

భారతదేశంలో సామాజిక రాజకీయ భావాలను వ్యాప్తిచేసేముందు ఆధ్యాత్మికాశయములతో ఈ భూమిని ముంచెత్తండి. మన ఉపనిషత్తులలో మన వేదాలలో, మన పురాణాలలో, మఠాలలో, అడవులలో, వివిధసమాజ

వర్గాలలో ఒదిగి ఉన్న పరమాద్భుత సత్యాలను వెలువరించి దేశములో— ఉత్తర దక్షిణాలలో— ప్రాక్ పశ్చిమాలలో— సింధు నుండి బ్రహ్మపుత్ర వరకు, హిమాలయముల నుండి కన్యాకాపీఠం వరకూ— మూలమూలలా— అన్ని దిక్కులా— మహాగ్నిశిఖల్లా విస్తరిల్లజేయండి.

భారతవర్షమే నశిస్తే ప్రపంచంలో ఆధ్యాత్మికత యే నశిస్తుంది; నైతిక సమగ్రత పూర్తిగా లుప్తమై పోతుంది; మధురము, ఆత్మికము నైన ధర్మానుభూతి నశిస్తుంది; ఆదర్శవాదం నశిస్తుంది. వీటికి బదులుగా కామ, భోగములే స్త్రీ పురుషులకు దైవములవుతాయి. ధనమే వీటికి పురోహితుడు; వంచన, బలాత్కారము— వీటికి పూజలు; మానవాత్మయే బలి అవుతాయి. అది జరుగరాదు.

మనకు మహోత్తమాదర్శం ఉండాలి. కాని ప్రజలలో అసంఖ్యాకులు ఆదర్శహీనులై, అంధకారమగ్నులై ఉన్నారు. ఆదర్శం గలవాడు వేయి తప్పులు చేస్తే, ఆదర్శం లేనివాడు యాభై వేలు చేస్తాడు. కనుక ఆదర్శం ఉండటం చాలా అవసరం. ఆ ఆదర్శానికై జీవన మర్పిద్దాం. ఇదే మన దృఢనిశ్చయం. నేను భవిష్యత్తును గురించి ఆలోచించడం లేదు. ఆలోచించదల్చలేదు కూడా. కాని నాకు కళ్ళ ముందు స్పష్టంగా కన్పిస్తున్నది— మన ప్రాచీన మాతృదేవి మరల మేల్కాంచి, పునరుద్ధరింపబడిన సింహాసనంపై మున్నెన్నడూ లేనంత మహావైభవంతో ఆసీనురాలై ఉన్న దృశ్యం మాత్రమే. శాంతి శుభకామనాస్వరంతో ఆమె వైభవాన్నే విశ్వమెల్ల మార్మోగించండి.

లేవండి! మేల్కొనండి! లక్ష్యమును సాధించువరకు విశ్రమించకండి!

ఉత్తిష్ఠత! జాగ్రత్త! ప్రాప్యవరాన్ని బోధత!

## దరిద్ర దేవోభవః

మన పూజలలో ప్రప్రథమంగా సేవ్యమైనది మనచుట్టూ వ్యాపించిన విరాట్ స్వరూపం. దానిని ఆరాధించు. ఈ మానవులూ, పశువులూ అంతా మన పరమేశ్వరులే. మన దేశప్రజయే మనకు ప్రథమంగా ఆరాధింపదగిన దైవం. "ఎచ్చట గాంచిన నీ హస్తములే, ఎచ్చట చూచిన నీ చరణములే; ఎచ్చట గనినా నీ కర్ణములే, నిజముగ నీవు సర్వవ్యాపివే". అని మనం భజించే భగవంతుని మేల్కొనియున్న స్వరూపము మన యీ సమాజమే. మిగతా దేవతలందరూ సుషుప్తిలో ఉన్నారు. మన చుట్టూ ప్రత్యక్షంగా కన్పిస్తున్న విరాట్, సమాజరూప పరమేశ్వరుని అర్చించకుండా, నిష్ప్రయోజకులైన దేవతల వెంటబడి దేవులాడటమేమి విచిత్రం?

* * * *

ఈ దేశపు నిరుపేద దళిత ప్రజాకోటి హృదయాల నుండి స్రవించే రక్తంతో పెంచబడి, విద్యాబుద్ధులు గడించి, వారి గురించి తలవనైనా తలవని ప్రతి వ్యక్తి ఒక దేశద్రోహియే.

* * * *

నీవు చేసే ప్రతి పనీ స్వాశ్రయమే, స్వప్రయోజనకరమే. ఒక వైద్యశాలనో, అలాంటి మరేదో నిర్మించి పరమేశ్వరుని సేవించాననుకుంటున్నావా? మన సేవలకై దేవుడు తపిస్తూ పడిలేడు. నీకు సేవావకాశాన్ని ఆయన ప్రతిపాదిస్తున్నాడు. ఈ మహావ్యాయామశాలలో నీ కండలబలాన్ని నిర్మించుకునే అవకాశం ఇస్తున్నాడు. అది నీ కొరకే– తన కొరకు కాదు. నీ సహాయం లేని కారణాన ఒక చీమ ఐనా మరణిస్తుందనుకుంటున్నావా? అది ఈశ్వరుని పట్ల అపరాధమే. పరమేశ్వరునికి సహాయం చేసేందుకు గాక, పరమేశ్వర ప్రాప్తి కొరకు పరిశ్రమించే మహదవకాశం లభించిన మనం ధన్యులం. 'సహాయం' అనే మాటను నీ మనసులో నుంచి పెకలించు. నీవు సహాయం చేయజాలవు. అది దురూహ. అర్చనగా భావించి

పనిచేయి. దరిద్రునిలో నారాయణుని దర్శించు. ఇది ఆయనను సేవించే అవకాశం పొందడమే. సమస్త ప్రపంచం పట్ల ఇ పూజా ప్రవృత్తి నా ంచు. అప్పుడే నీకు సర్వసంగరాహిత్యం సిద్ధిస్తుం . ఇదినీకర్తవ్యం. ఇ సత్క్రమ కర్మమార్గం. ఇదే కర్మయోగం బోధించే రహస్యం.

సేవా– సమర్పణ– ఇవే హిందూదేశ జాతీయాదర్శాలు. ఈ మార్గాలలో దేశాన్ని ఉద్ధృతం చేయండి. మిగిలిన పనులన్నీ వాటంతట అవే జరుగుతాయి.

* * * *

విశాల హృదయులైన వందలాది పురుషులు, స్త్రీలు జీవితసుఖాలను అనుభవించాలనే కోరికలను త్యజించి, దీనత్వంలో అజ్ఞానంలో కూరుకు పోతున్న కోట్లాది మన దేశీయుల సంక్షేమానికై తపించినపుడు మాత్రమే హిందూదేశము జాగృతమవుతుంది.

* * * *

'మాతృదేవోభవ', 'పితృదేవోభవ' అని మీరు చదివి ఉంటారు. అయితే నేనంటాను– 'దరిద్ర దేవోభవ, మూర్ఖదేవోభవ'. దరిద్రుడు—— అక్షరజ్ఞాన శూన్యుడు, అజ్ఞాని, బాధాతప్తుడు– వీళ్ళే నీ దైవాలు కావాలి. వీరి సేవయే పరమ ధర్మమని గ్రహించు.

* * * *

నా మాట పట్ల మీకు గౌరవం ఉందా? మీ ఇంటి ద్వారాలను, కిటికీలను తెరవండి. మీ ఇంటి ప్రక్కనే హీన తిలో కష్టాలమధ్యఅల్లాడు తున్న పేదప్రజానీకం ఎందరో ఉన్నారు. శ్ర తో, ఉత్సాహంతో వారి దగ్గరకు పోయి సేవించండి. రోగులైనవారి మందు చ్చే ఏర్పాటు చేయండి. శ్రద్ధగా పరిచర్యలు చేయండి. ఆకలితో అలమటించేవారికి అన్నం పెట్టండి. అజ్ఞానులైనవారికి మీకు తెలిసిన మేరకు చదువు నేర్పండి.

* * * *

నాగలి ప  పొలం దున్నే కర్షక బాలుడు చదువుకోడానికి రాలేక పోతున్నపుడు,  దువు చెప్పేవారే పొలానికి, కర్మాగారానికి లేదా అతడెక్కడికి పోతే అక్కడికి పోయి ఎందుకు చెప్పరాదు? అతని వెంట నీడలాగా వెళ్ళండి. వారికి చెప్పే చదువులో ఎక్కువ భాగం మౌఖికంగానే ఉండాలి. ప్రతి సాయంత్రమూ— పేద ప్రజల్ని— శుచికారుల్ని సైతం— ఒక చోటకు చేర్చండి. వారికి ముందు ధర్మాన్ని గురించి చెప్పండి. ఆ తరువాత మాయాలాంతరు, గ్లోబు, దేశపటాలు ఉపయోగించి వారికి ఇతర విషయాలు కూడా— ప్రజల భాషలోనే నేర్పండి.



## విజయానికి కీలకం

మీరు ముత్యపు చిప్పలా కావాలి. స్వాతిబిందువు పడటంతో అది వెంటనే మూసుకొని సముద్ర గర్భాన్ని చేరి ఆ నీటి [illegible]వు ముత్యంలా ఎదిగే వరకూ ఓపికగా ఉంటుంది. మనమూ అలా ఉండాలి. మొదట వినండి, తరువాత గ్రహించండి, పిమ్మట తొణకకుండా బాహ్యప్రభావాలు పడకుండా మనస్సును నిగ్రహించుకొని మీలో నున్న సత్పదార్థాన్ని వికసింపచేసుకోడానికి కృషి చేయండి. ఆదర్శం పట్ల ఉన్మాదప్రవృత్తి ఉంటేనే. జ్యోతిని దర్శించగలరు. అక్కడొక ముక్కా, ఇక్కడొక ముక్కా సంగ్రహించుకునేవాడు సాధించేదేమీ ఉండదు. క్షణికమైన సంచలనం కన్పించవచ్చు. కాని అది అంతటితోనే అంతమవుతుంది.

మీరు హనుమన్మహావీరునే ఆదర్శంగా గ్రహించాలి. రామాజ్ఞచే అతడెలా సముద్రం లంఘించాడో చూడండి! అతనికి జీవన మరణభయం లేదు. అతడు జితేంద్రియ శ్రేష్ఠుడు. అద్భుత ధీవిశారదుడు, ఈ స్వయం సేవాభావము నాశ్రయించి మీ జీవితాదులను నిర్మించుకోవాలి. ఆ తరువాత ఇతరాదర్శాలన్నీ అవతరిస్తాయి. సంశయరహితమైన గురుభక్తి, తీవ్ర

బ్రహ్మచర్యానుష్ఠానము— ఇవే జీవన విజయరహస్యము. హనుమంతుడు సేవాతత్వానికి ఆదర్శమూర్తియే కాదు; ప్రపంచాన్ని దిగ్భ్రాంతమొనర్చ గల పరమ సాహసానికి ప్రతీకం కూడా. రామసేవలో తన ప్రాణాలనైనా నిస్సంశయంగా సమర్పించగల సాహసం, ఇతర విషయాలన్నిటిపట్లా— తుదకు బ్రహ్మత్వ ప్రాప్తి, శివత్వసిద్ధి పట్ల కూడా ఔదాసీన్యం. రాముని ఆజ్ఞాపాలనమే జీవన ప్రతిజ్ఞ. అట్టి సంపూర్ణ శ్రద్ధ నేడు కావాలి.

* * * *

ప్రతి విద్యుక్త కర్మయూ పవిత్రమే. విద్యుక్త కర్మపట్ల శ్రద్ధ కలిగి ఉండటమే పరమేశ్వరు నారాధించే ఉత్తమ మార్గం. మనకు సన్నిహితంగా మన చేతుల్లో ఉన్న మన విద్యుక్త ధర్మాన్ని ఆచరిస్తే మనకు శక్తి లభిస్తుంది. ఇలా క్రమంగా మన శక్తిని పెంచుకుంటూ పోయిన పక్షంలో జీవనంలో సమాజంలో పరమోన్నత విధులను నెరవేర్చే మహదవకాశం లభించే స్థాయి మనకు లభించవచ్చు

* * * *

మన ఉపనిషత్తులు శ్రేష్ఠమైనవే. మన పూర్వులు మహనీయులే. కాని మనం నేడు బలహీనులం, అతి బలహీనులం. మొదటిది మన దైన్యాలన్నింటికీ మూలహేతువైనదీ— శారీరిక దౌర్బల్యం. మనం సోమరులం, అసమర్థులం. మన యువకులు బలశాలురై ఉండాలి. ఇది ప్రథమావసరం— ఆ తర్వాత ధర్మాన్ని గురించి ఆలోచించవచ్చు. మరికొంచెం దృఢమైన దండ కండరాలు ఉంటే గీతాశాస్త్రాన్ని మరింత చక్కగా గ్రహించగలవు. మరింత బలకరమైన రక్తంతో శ్రీకృష్ణుని మహాప్రతిభను పాటవాన్ని మరింత చక్కగా గ్రహించగలవు.

* * * *

మన గ్రంథాలలో నిండియున్న ఆధ్యాత్మికతామణులను వెలికి తెచ్చి, వానిని వ్యాపింపజేయాలని నా సంకల్పం.

ఉపనిషత్తులే మనకు ప్రమాణ గ్రంథాలు. భారతదేశములో ఏ

సాంప్రదాయానికి చెందినా; ఏ సిద్ధాంతాన్ని చేప నా, ప్రమాణం కొరకు ఉపనిషత్తులనే ఆశ్రయించాలి. దాని నంగీకరిం నిచో అది విధర్మీయతే.

జైన బౌద్ధ తత్వగ్రంథాలు కూడా శ్రుతిసహాయ్యాన్ని కాదనలేదు. బలము— బలము- ఇదే ఉపనిషత్తుల ప్రతి పుటా నాకు ఉపదేశించేది. మన జాతిని బలహీనపరచటానికి కారణమైన ఎన్నో విషయాలు మనమీ గత వేయి సంవత్సరాలలో అనుభవించాం. నేడు మనకు కావలసింది బలము- బలము- ముమ్మాటికీ బలమే. ఈ బలానికి ఉపనిషత్తులు మూలరాశులు. సమస్త ప్రపంచాన్ని క్రియమాణ మొనర్చగల శక్తి ఉపనిషత్తుల్లో ఉంది. వానితో ప్రపంచాన్ని ఉద్రూతలూగించవచ్చు; శక్తిమంతమొనర్చవచ్చు; ఉత్తేజితమొనర్చవచ్చు. స్వేచ్ఛ, శారీరిక స్వేచ్ఛ, మానసిక స్వేచ్ఛ, ఆధ్యాత్మిక స్వేచ్ఛ- ఇదే ఉపనిషదుద్ఘోష.

* * * *

దక్షిణ సముద్ర ద్వీపాలలో తుఫానుకు గురియైన కొన్ని ఓడల ఉదంతాన్నీ, వాటి చిత్రాలను 'లండన్ న్యూస్' అనే పత్రికలో నేను ఒక సారి చూచాను. ఒక్క ఆంగ్ల నౌక తప్ప మిగతా నౌకలన్నీ భగ్నమైనాయి. ఆ ఒక్కటే తుఫానులో నిలవగలిగింది. భగ్ననౌకలమీద మునిగి పోవడానికి సిదంగా ఉన్న జనం బ్రతికి బయటపడిపోతున్నవారిని అభినందించే దృశ్యం ఆ చి—లలో ఉన్నది. అట్టి యిర్యాన్ని, ఉదారతను అలవరచుకోండి. మీ౦ పాటు మిగతావారిని ది లాగజూడకండి.

* * * *

ఆలోచనలే క్రియాశక్తికి మూలం. మనస్సును ఉన్నత భావాలతో నింపండి. ప్రతి నిత్యమూ ఉత్తమ భావాలు వినండి. నెలల తరబడిగా వాటినే మననం చేయండి. అపజయాలను లెక్కించకండి. అవి సహజాలే. జీవితానికి అవి అందాన్ని చేకూరుస్తాయి. ఆదర్శాన్ని నిరంతరంగా ఉన్న

తంగా నిలుపుకోండి. వేయిమారులు పరాజయమెదురైనా మరోసారి ప్రయత్నించకుండా విడువకండి.

*　　　*　　　*　　　*

భాగవత సైనికుడు యుద్ధరంగంలో పిరికితనం ప్రదర్శించడం ఎన్నడైనా ఎరుగుదువా? ఎన్నడూ లేదు. కాని వారికి నాయకులు కావాలి. "ముఖ్యుడు తన శిరస్సు నర్పించ సిద్ధం కావాలి". నీ జీవితాన్ని ఒక మహత్తరాదర్శం కొరకు సమర్పించగలిగినపుడే నీవు నాయకుడవు కాగలవు— కాని త్యాగం చేయకే నాయకులు కావాలని మనం చూస్తుంటాం. ఫలితమో! శూన్యం. మన మాట వినేదెవడు?

*　　　*　　　*　　　*

ప్రగాఢ విశ్వాసంతో దేశహితానికై సర్వస్వార్పణం చేయగల పురుషులున్నపుడే, అట్టివారు ఉద్భవించినప్పుడే సర్వతోముఖ భారత సౌభాగ్యం సిద్ధిస్తుంది. దేశాలను నిర్మించేది ఇట్టి వ్యక్తిత్వాలే.

*　　　*　　　*　　　*

ఇది ఉపన్యాసాలకు తరుణం కాదు. నేటి మన విద్యార్థులు అట్టి ఉపన్యాసాలను విని, కరతాళధ్వనులు చేస్తూ 'బాగు—బాగ'ని పొగడటం తప్ప మరేమీ చేయజాలరు. ప్రజలకు సజీవము, ప్రదీప్తమూనైన ఆదర్శాన్ని చూపనిదే మన దేశానికి మోక్షం లేదు. దేశహితార్థమై తమ జీవితాలను అర్పించగల, సర్వత్యాగాలు చేయగల యువకులు నేడు కావాలి. ప్రప్రథమంగా వారి జీవనాలను నిర్మించాలి. అప్పుడే నిజమైన కృతి ఆరంభమౌతుంది.

*　　　*　　　*　　　*

సాధ్య, సాధనాల పట్ల సమాన శ్రద్ధ చూపటమే విజయానికి కీలకం. మామూలుగా అపజయాలు లభించడానికి కారణాలు శోధించండి. తొంబది తొమ్మిది సందర్భాలలో సాధనాల పట్ల అశ్ర చూపటమే కారణం అని ఋజువవుతుంది. నేడు మనం సాధనాలను ఒ షరహితంగా

సమర్థంగా నిర్మించుకోవాలి. సత్క్రమ సాధనాలుంటే సిద్ధి తప్పనిసరిగా లభిస్తుంది. కారణాల పట్ల శ్ర వహిస్తే కార్యం నెరవేరక తప్పదు. లక్ష్యప్రాప్తియే మన కార్యం; నికి కారణం సాధనాలు- వానిపట్ల శ్రద్ధ వహించాలి. ఇదే విజయరహస్యం.

* * * *

నేడు మీరు పొందుతున్న విద్యలో కొంత మంచి ఉన్నది. కాని దానివలన మూడేకీడు క్రింద ఆ మంచి అణగిపోతున్నది. మన దేశంలో మహాపురుషులంటూ జన్మించారనేదే మనకు బోధించరు. సార్థకమైనదేదీ మనకు బోధింపబడదు. మన కాళ్ళు సేతుల ఉపయోగం కూడా మనకు తెలియదు. ఆంగ్లేయుల పూర్వజుల వివరాలనన్నిటినీ మనం కంఠోపాఠం చేస్తాం. కాని మన పూర్వులను గురించి ఔదాసీన్యం కనబరుస్తాం. మనం నేర్చుకున్నదల్లా దౌర్బల్యమే.

బుర్రలలో విషయ బాహుళ్యాన్ని నింపి, గందరగోళం చేసి, జీవితంలో ఎన్నటికీ అర్థం కాకుండా ఉండేది విద్య కాదు. శీలాన్ని రూపొందించి, వ్యక్తిని నిర్మించి, జీవితాన్ని తీర్చిదిద్దే భావనల అవగాహన మనకు ఉండాలి. ఆ భావాలను, అవగతం చేసుకుని, వాటిని నీ శీలంలో నీ జీవితంలో అంతర్భాగంగా రూపొందించుకున్నట్లయితే ఒక గ్రంథాలయాన్నంతటినీ కంఠస్థం చేసిన వాని కంటే నీవు ఎక్కువ విద్యావంతుడవైనట్లే.

* * * *

సామాన్య జనసముదాయాన్ని జీవన సమరానికి సంసిద్ధం చేయని విద్య, సౌశీల్యశక్తిని, ఉదార భావనను, సింహ విక్రమాన్ని వెలికి తీయని విద్య- విద్య అనిపించుకుంటుందా? వ్యక్తిని తన కాళ్ళ మీద తాను నిలబడేలా చేసేదే నిజమైన విద్య.

* * * *

మన దేశపు వ్యావహారిక, ఆధ్యాత్మిక విద్యల మీద మన అధి

కారం ఉండాలి. స్వప్నాలలో, సంభాషణలో, ఆలోచనలో దాన్ని గురించే మననం చేసుకోవాలి. దానిని సాధించాలి. అంతవరకూ మన జాతికి విముక్తి లేదు. దీనికో వ్యవస్థ అవసరం. ఎలాంటిది? ఉదాహరణకు, మనకో మందిరం కావాలి. అది వర్గాతీతంగా ఉండాలి. అందులో అన్ని సంప్రదాయాలకూ మహోత్తమ చిహ్నమైన 'ఓం' ఒక్కటే ప్రతిష్ఠింప బడాలి. తమ మతాన్ని ఏ సంప్రదాయానికి చెందినవారు, ఆ సంప్ర దాయాన్ననుసరించి నిర్వహించవచ్చు. మందిరంమాత్రం ఒక్కటేఉండాలి. ఇక్కడ విభిన్న సంప్రదాయాలలోని సమాన ధర్మాలు బోధింపబడాలి. దానితో ఏ సంప్రదాయాన్ని అనుసరించే వాడైనా అక్కడ తన విధానాన్ని బోధించవచ్చు. ఒక్కటే నియమం; పరస్పరం కలహించుకో రాదు.

ఈ మందిరానికి అనుబంధంగా, ధర్మాన్నీ, వ్యావహారిక విద్యనూ–రెంటినీ మన ప్రజలకు బోధించడానికి అధ్యాపకులకు శిక్షణ నిచ్చే ఒక సంస్థ ఉండాలి. ఆ అధ్యాపకులు రెండింటినీ ప్రబోధించాలి. పరస్పర సహకారాన్నీ, పరస్పర సానుభూతినీ హిందువులకు నేర్పే ఒక సంస్థ చాలా అవసరం. జాతి స్వభావమంతా శిశుస్వభావానికివలె పరాధీనంగా తయారైంది. నోటివద్దకు ముద్ద తెస్తే తింటారు. కొందరికి లోనికి త్రోయాలికూడా.... మీకు మీరు సహాయం చేసుకోలేకపోతే, జీవించే అర్హత కూడా ఉండదు. నేడు భారతదేశంలో నలుగురు కలసి నాల్గు ఘడియలపాటు ఏ పనీ చేయలేరు. అట్టి దేశంలో ఎన్ని భేదాలున్నా పర స్పరం దుర్భేద్యమైన ప్రేమపాశంతో బంధింపబడిన ఒకయువకసంఘాన్ని నిర్మించాలి! ఇదెంత అద్భుతమైన విషయం! ఈ సంఘం వికసిస్తుంది. ఈ మహాద్భుతౌదార్యం, శాశ్వత శక్తినీ, పురోగతినీ పెనవేసుకొని భారత దేశమంతా వ్యాపించాలి. విద్యుత్తులా జలదరింపచేయాలి. ఎంత అజ్ఞానం, విద్వేషం, కులకక్షలూ, మూఢాచారాలూ, ఈర్ష్య ఉన్నా, ఈ ప్రేమభావం సమాజంలో నరనరాలలో వ్యాపించాలి.

నీవు నిజమైన సంస్కర్తవు కావాలంటే, మూడు విషయాలు అవసరం.

మొదటిది అనుభూతి.

మొదట మనసా అనుభూతి పొందు. పరమేశ్వరుని చూడడానికి మార్గం హృదయమే కాని బు కాదు. బుద్ధి సంశోధనకారి మాత్రమే. విద్యుత్తు కంటే, మరే ఇతర షయం కంటేనూ మహోద్భృత వేగంతో కదలాడేదీ, పని చేసేదీ హృదయమే. బుద్ధి కూడా అవసరమే. అది లోపిస్తే దారుణ దోషాలు, తీవ్రమైన తప్పిదాలు చేస్తాము. బుద్ధి వీటిని నిరోధిస్తుంది అంతే. ఆపైన బుద్ధిబలం ద్వారా ఏదో సాధించాలని ప్రయత్నించకు. ప్రేమ దు మ ద్వారాలను సహితం ఛేదిస్తుంది. సృష్టి రహస్యాలకు ప్రేమే పర మార్గం. కనుక హృదయానుభూతి అవసరం.

నీకు సానుభూతి కలదా! అది మొదటి మెట్టు. తర్వాత ఉపాయం అన్వేషించావా? అయితే అది రెండో మెట్టు. మరొకటి ఉన్నది. ఇందులో నీ ఉద్దేశ్యం ఏమిటి? కీర్తి, అధికారం, ధనం నిన్ను పురిగొల్పటం లేదు కదా!

ఉత్తుంగ శృంగాలలాంటి బాధల తరించగల మనోనిశ యం నీకు ఉన్నదా? సమస్త ప్రపంచం కత్తి ఎత్తి నిన్నెదిరించినా నీ శ్వాసాలకై ప్రయత్నించగల సాహసం ఉన్నదా?

ఈ త్రిగుణాలూ ఉంటే మీలో ప్రతి ఒక్కరూ పరమాద్భుతాలను సాధించగలరు.

* * * *

మన సమాజానికి నేతృత్వం వహించింది రాజులూ కాదు; సేనాపతులూ కాదు; ఋషులు. ఎవరీ ఋషులు? వారు సామాన్య మానవులు కాదు. ఉపనిషత్తులలో చెప్పబడ్డట్లు వారు మంత్రద్రష్టలు. ధర్మ సాక్షా

త్కారం పొందిన మహనీయులు వారు. ధర్మమనేది వారికి గ్రంథ విజ్ఞానం కాదు; వాదనా విషయమూ కాదు; ఊహాలోక విహారమూ కాదు; ఉపన్యాస ప్రవాహమనలే కాదు. వారి కది వాస్తవ సాక్షాత్కారము; ఇంద్రియముల కతీతమైన సత్యముల ప్రత్యక్ష దర్శనము. ఇదీఋషిత్వము ఇది దేశకాలములకు, వర్గవర్ణములకు అతీతమైనట్టిది. సత్యమును సందర్శించి తీరాలంటాడు వాత్స్యాయనుడు- మీరు, నేను, ప్రతి ఒక్కరూ అసత్యసందర్శనము చేసితీరాలి. మనకు అట్టి ఆత్మవిశ్వాసముండాలి. మనకు సర్వశక్తి ఉన్నది. అందువల్ల మనమీ ప్రపంచాన్ని కదలించివేయగలగాలి.

ధర్మాన్ని ప్రత్యక్షంగా దర్శించాలి, అనుభూతి పొంది తద్వారా సర్వసంశయములను విచ్ఛిన్నం చేసుకోవాలి. అట్టి ఋషిత్వప్రకాశంలో నిలచిన మనం మహాశక్తిమంతులముగా భాసిస్తాం; మన పెదవుల నుండి వెలువడే ప్రతి పలుకూ అనంతశక్తిమంతమవుతుంది. మనం శపించకుండానే, మనం నిందించకుండానే, మనం పోరాడకుండానే, సమస్త దౌష్ట్యమూ నశించిపోతాయి. మన ముక్తికి, అన్యుల ముక్తికిగాను అట్టి ఋషిత్వమును సాధించుటలో భగవంతుడు మనకు సహాయపడుగాక!

* * * *

ఉత్తములు, ఉన్నతులూనైన వ్యక్తుల త్యాగం భారతావనికి అవసరమై ఉంది. ఇది స్పష్టం. సర్వజన శ్రేయస్సు కోసం, సకల జన సంక్షేమం కోసం ఈ ధరిత్రిలోని అత్యంతసాహసికులు, ఉత్తమోత్తములూనైన వ్యక్తులు తమని తాము అర్పించుకోవలసిఉంది. అనంతమైనప్రేమ, దయ కల్గిన వందలాది గౌతమ బుద్ధులు కావాలి నేడు.

* * * *

ధనము, యశము లేదా మరొకటి- ఏదో విధమైన ఆపేక్ష ఏదీ లేకుండా పనిచేసేవాడే బాగా పని చేసినవాడు. ఆ విధంగా పని చేయగల్గిన.

వాడు బుద్ధ భగవానుడే కాగలడు. ప్రపంచాన్ని మార్చివేయగల శక్తి సామర్థ్యాలు అతనిలో నుండి వెలికి వస్తాయి.

* * * *

హిందూ దేశ జనసామాన్యాన్ని ఉద్ధరించే పవిత్ర కర్తవ్యానికే అంకితం కాగల యువజనులుగా పని చేయండి. యువతని మేల్కొల్పండి. సంఘటితపరచండి. సమర్పణాభావంతో వారిని ఉత్తేజితులను చేయండి. హిందూ యువజనులమీద ఆధారపడే ఈ పని అంతా జరుగుతుంది. నేను జన్మించింది ఈ యువశక్తిని సంఘటితపరచడానికే. నేను మాత్రమే కాదు; ప్రతి నగరం నుండి వందలాదిగా వచ్చి నా కృషిలో పాలు పంచుకుంటారు. అప్రతిహత తరంగాల్లా ముందు కురుకుతూ దేశమంతా వ్యాపించి అత్యంత సామాన్య, దీనదళిత జనావళికి సుఖాన్ని, నైతికతను, ధర్మాన్ని, విద్యను వారి గుమ్మాలకడనే అందజేస్తారు. వారినలా ఉద్యుక్తులను చేయడమే నా వాంఛితం. నేను దీనిని సాధిస్తాను లేదా ఆ ప్రయత్నంలో మరణిస్తాను.

* * * *

పనిలో ఉద్యమించండి; మీరు ప లేనంతగా అద్భుతశక్తి మిమ్ము ఆవేశించటాన్ని మీరే గమనిస్తారు. ఇ రుల కోసం చేసిన ప్రతి చిన్న పనీ మీలోని ఆంతరిక శక్తిని జాగృతం చేస్తుంది. ఇతరుల మేలుగురించి చేసిన ప్రతి చిన్న ఆలోచన సింహంలో వలె మీ గుండెలలో బలాన్ని నింపుతుంది. నేను మిమ్ము ఎంతగానో ప్రేమిస్తున్నాను. అందుకే మీ రందరూ ఇతరుల కొరకు కృషి చేస్తూ, ఆ కృషిలోనే మరణించాలని కోరు తున్నాను. మీరలా చేయడం నాకెంతో ఆనందదాయకం.

* * * *

నాకు యువకులు కావాలి. "యువకులు, దృఢశరీరులు, ఆరోగ్య వంతులు సునిశిత మేధాసంపన్నులూనైనవారే పరమాత్మను చేరుదు"రని వేదాలు ఘోషిస్తున్నాయి. మీ భవిష్యత్తును గూ మీరు నిర్ణయించుకో వలసిన తరుణమిదే. యౌవనశక్తి ఉన్నపుడే- నలిగి క్షశించినశించిపోయే

టప్పుడు కాక— నవయౌవనంలోనే కార్యసాధనకు ఉద్యమించండి. ఇదే తరుణము. భగవానుని చరణాల మ్రోల సమర్పించేదీ, భగవానుడు స్వీకరించేదీ అచుంబిత అనాఘ్రాత నవకుసుమాలనే గదా! కావున ఇదే తరుణము. కార్యసాధనకు ఉద్యమించండి. జీవితం స్వల్పకాలికం కాబట్టి లేవండి! మత్తు వదలండి! కలహాలని అన్వేషించే న్యాయవాదులుగానో మరో విధంగానో దనా న చేస్తూ జీవించాలని ఆశించేకంటే చేయదగిన ఉత్తమ కార్యాలు అనే ం ఉన్నాయి. నీ జాతి హితం కొరకు, మానవాళి శ్రేయస్సు కొరకు నిన్ను నీవు సమర్పించుకోవటమే సర్వోత్తమ కార్యం.



# సహృదయ పాఠకులకు నవభారతి సమర్పించిన

## పుస్తక రత్నాలు

| పుస్తకము పేరు | రచయిత పేరు | వెల |
|---|---|---|
| 1. నాగానీక | ముదిగొండ శివప్రసాద్ | 10-00 |
| 2. పుష్యమిత్ర | శ్రీ గురుదత్ | 15-00 |
| 3. 1857 స్వరాజ్య సంగ్రామం | సావర్కార్ | 15-00 |
| 4. జన విజయం | బండారు సదాశివరావు | 11-00 |
| 5. మార్క్సిజమా? మానవతావాదమా? | వజ్రనఖ | 9-00 |
| 6. స్వాతంత్ర్య వీరసావర్కార్ | శ్రీ ఆర్. ఆర్. | 5-00 |
| 7. ఉజ్జయినీ పతనం | హెచ్. పి. ఛటోపాధ్యాయ | 8-00 |
| 8. నేతాజీ సుభాష్ చంద్రబోస్ | పి. గోపిరెడ్డి | 13-00 |
| 9. జై సోమనాథ్ | కులపతి కె. యం. మున్షీ | 20-00 |
| 10. స్వాతంత్ర్య సమరజ్వాలలు | నా. వి కాకత్కర్ | 15-00 |
| 11. కాళరాత్రి | హెచ్. వి. శేషాద్రి | 20-00 |
| 12. హిందూ విజయదుందుభి | శ్రీ రామ్‌సాఠే | 9-00 |
| 13. చంద్రశేఖర్ ఆజాద్ | బాబు కృష్ణమూర్తి | 15-00 |
| 14. శ్రీ జగద్గురు శంకరాచార్య | దీనదయాళ్ ఉపాధ్యాయ | 10-00 |
| 15. గాంధేయ సోషలిజం | కందర్ప రామచందర్‌రావు | 5-00 |
| 16. వందేమాతరం | శివరాం | 10-00 |

## ముద్రణలోనున్న పుస్తకరత్నాలు

1. హైదరాబాదు అజ్ఞాత చరిత్ర పుటలు — ఖండేరావు కులకర్ణి
2. ఉత్తిష్ఠత జాగ్రత్త
3. మహారాణా బాపా!